# మధురవేదన



'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్
పర్యుత్సుకీభవతి యత్సుఖితోపిజంతుః'





కవి

నల్లానిచక్రవర్తుల వెంకటాచార్యులు

# మధురవేదన





(రాధాకృష్ణుల ప్రేమ సీమా రహితము. అది రాధ ఒంటిగా జీవితాన్ని గడుపుతూన్న సమయం. ఒకనాడు ఏమీతోచనిస్థితిలో రాధ యామునా సైకతాల్లోకి వచ్చింది. కష్టసుఖభారాల భావోద్వేగం తాను భరించే శక్తికి అతీతమైంది' అప్పుడు వేదన- అదే మధుర మైంది.)

అమిత వేదనాభర హృదయాంతరమున
చిలికెదేల? ఆశారసశీకరముల
జీర్ణశైథిల్య పాండుర జీవితమున
యామునాసైకతమ్ముల నరయలేను.

మధురమృదుల వాగ్భావ సామ్రాట్టు! నీదు
చలదపాంగ కటాక్షవీక్షణలవప్ర
పంచ నిర్మిత స్వర్గసోపాన పాంథ
జనునకెయ్యది గమ్యంబు?

స్వాప్నిక సుఖానుభూతి విశ్వంభరాప్తిఁ
జెంది హృదయంబు శశ్వదానందపార
వశ్యరసమయ భావానుభావవీచి
కావిహారంబుఁ జేయించె గాని—యింత
సౌఖ్యము భరించి జీవింపజాల...

శ్యామ! ఉన్మీలిత నిమీలితానుభవము
లందు జాగ్రత్సుషుప్త్యవస్థాంతరముల

మహితమోహన రమ్య నైర్మల్యమూర్తి
సన్నిధానముగల్గెడు... ...
లలిత లాలిత్యగాన కళానిదాన
వేణువీణారవోదిత విమలగీతి
కాకలీస్వనమెపుడు నిషాక్రాంతిఁజెంద
అపుడు గుండెకు స్పందన మంతరించు.

## స్వప్న గానము

(నిజంగా అది కలే. చక్కని చల్లనిరాత్రి. ప్రాంగణం లోను చకిలిగింత పెడుతూన్న తెల్లని వెన్నెల. పచ్చికమీద మీద ఒక అపూర్వవ్యక్తి అందమైన పాపాయిని వళ్ళోపెట్టుకొని లాలిపాట పాడుతూంది. ఆ పాటలో పూర్వప్రేమగాథ లోని అనుభూతులు వ్యక్తీకరింపబడుతున్నాయి. ఆ మహాస్వర కోమల మధురగానం ఆత్మను ప్రపంచపుచాటుకు తీసుకొని పోయింది. ఆనందం అధికమైనా భరించడం కష్టం.)

"జో"యని జోలపాటను విశుద్ధగళోదిత పంచమ స్వనా
ధ్యేయముజేసి, విశ్వవితతీనవరాగరసంబునం దనా
ప్యాయత గల్గజేసియు, విభావరి నైశితచంద్రికావిధో
ప్యాయపుగాననైపుణి ప్రపంచపుచాటుకు నొత్తిగించెదీ.
"లాలి" యటంచు నీయొడిని లాలనజెందిన పాప ప్రేమ భా
రాలసమంద మంద దరహాసదృగంచలరేఖలుగా, నిటా
లాలకచంచలమ్ములు విహారమొనర్చెదు; స్వాప్నగాన భా
వాలపమాన దివ్య నవ వాక్కణడోలల స్వప్నవర్తినీ!

తీయనిపాటలో వలపుతీరుల భావరసంబుపొంగ, లే
బ్రాయపు పిన్ననవ్వులు పరామరిశింపగ, గానమూర్తి! ప్రా
ణేయతుషారశీతల నిరీక్షల నీహృదినింపెదో కథా
ధ్యేయుని! నిద్రవచ్చుతరి తీపులపాటకు చిత్రవర్తిని!
హృదయపువీణతంత్రుల స్వరింపగఁజేయుచు ముక్తకంఠమం
గూఢమునందు చాటుకథల్సాద్ధిక పాడఁగబోను నెచ్చెలీ!
హృదయపుస్పందనంబు కుదియించెను, నిఃశ్వసనంబుభారమై
సది, ఏక మందరస్వరము నందొక గీతికఁబాడి యాపుమో
మృదుగళ! రాత్రిలో సగముమీరెను......

## ఉ గా ది

(తారణ సంవత్సరాది)

జీవితగాధలోపల రచించిన కమ్మని తేటగీతికా
భావము పూర్తియైనది; నవంనవమోహనరాగమంజులా
శావశనూత్న గీతిక విశాలపదమ్ముల పాటపాడుటో,
కేవలతత్వమార్గమున కీర్ణములౌసుమనస్సు లేరుటో,
భావినవీనజీవితపు వాయుపథమ్మున 'మిన్కు' మన్న తా
రావళి కాంతివర్ధనములౌనో, అకాలవినీల వారివా
హావలయమ్ములోన లయమై, సుమముంబుల గోలుపోవునో,
ఏవిధిఁజూడ నన్నియును ఎచ్చటనందని దుస్సమస్యలే.

## ఉ డు గ ర

ఈ నవమాధవీ ఋతువనేందిర దెచ్చిన పూలసెజ్జలోఁ
దేనెలు వాకలై వెడలు తీయదనంపు సువాసనల్, నిరా

శానిల గ్రీష్మవాసర ప్రశాంతి విలుప్తపు జీవితమ్మునన్
సోనలువారి, ఆసనిడుచున్నవి కొమ్మిదె పూలమాలికన్

రాజు వసంతమూర్తి మధురంపు రవాబుచు మేళవించు—నీ
ణాజనితంపు పంచమమునంగల మోహానరాగవర్ణన
శ్రీ జరియించుతావుల నిశీథినిఁదెచ్చిన వర్ణమాల నీ
కై జతనంబుజేసితి, ప్రియమ్మగగొమ్మిదె నీవు నెచ్చెలీ!

ఈమధుమాసవాసర నవేందు నిశీథినులందు తారకా
ప్రేమనిధాన మల్లదె మరీచుఁస్వాగతమిచ్చుచున్ కళా
ధామము నాదమాలికను దానముజేయుమటంచు గోరు; ఓ
కోమలపుష్పప్రేమిక! నిగూఢపుమాలికఁగొమ్ము......

ఈ మధురప్రవాసుని నిరీక్షిత నిశ్చల దృగ్గవాంతిమా
శామలరేఖలో నలిగి శ్యామలమయ్యెను మాలఁజూడ మ
ల్లీమసృణప్రసూనముల రేకులలోని మరందబిందువుల్,
నా మదిలోని కోర్కెలు పెనంగెడు నీలిమకుంతలాలకై

ఏ మధురానుభూతి రచియింపగజేసెనొ, ఈ సువర్ణమా
లామృదుసూనవాసనలఁ ఘ్రాణముఁజేయుచు నీవు ప్రేమభా
రామిత మందహాస రుచిరంబుగ జూడు మిటొక్కసారి స్వ
ర్గామృతపుష్పరాజ! హృదయంపువిహాయసమెల్లఁ దెల్లసా

## అ ను భూ తి

లేతవయస్సులో తెలియలేనితనంబున నింపుకొన్న దే
దో తరితీపుకాంక్షల నవోదయ నిర్మలప్రేమధామమై

మాతృకటాక్షవీక్షణాల మాధురిలోనఁ బెరుఁగుగుండె, సా
కూతనిరీక్షణంబుల నిగూఢ మొనర్చెను కాలవాహినిన్.

అదియొకనాఁడు జీవితప్రయాణమునందున పూర్వభావ స
త్పథమున జిక్క నట్టి నవభావవికాససుమంబు రాగసం
పద నపురూపమంజులప్రభల్ నవజీవననందనంబునం
దుదయము జెందఁజేసెను; ఫలోదయభావిసుఖేప్సునై హృదిన్,

అదియొకనాఁడు జీవితమునందున నెన్నఁడెరుఁగనట్టిదా
ఉదితసువాఙ్మనస్సులకు ఊహకు మించు మహానుభూతి, స
మ్మోదమునఁగొన్నప్రేమ నవముగ్ధనిమేషముగల్గురోజు, ఈ
హృదయపుచాలనమ్ము విధురీకృతమైనను విస్మరింతునా?

అదియొకనాఁడు జీవితవిహాయసమందు నవోదయప్రభల్
మొదలిడినట్టి లిప్త; ననమోహనముగ్ధరసానుభూతి నా
యెదపదిలించినట్టి మధురీకృత జీవననవ్యతార; ఏ
పదముననైన ప్రేమరసభావములూరుట నైజవృత్తియా
అది మొదలీస్వరాజ్యమున కంతకు రాజునొ, రాజరాజునో—

అదియె పూర్వజన్మాంతఃఫలానుభూతి
మధుర నవ భావిజీవిత మార్గదర్శి
రసకవిత్వస్వరూప నిర్మాణశక్తి
అదివినా ... ...

## వి షా ద ము

విశ్వమంతా వెలుగు వెల్లి విరిసింది
గుండెలో చీకట్లు కుదురుకున్నాయి

కృష్ణవేణీతరంగిణి సైకతాల
చల్లగాలులు మెల్లసాగిపోయాయి
ఎడదఎడారిలో ఏకమైపోయి
షడమాటిశాంబరాల్ సాగుతెల్లు"
ఆ ఉషారాణి వీణాపాణిలోన
భావగేయాలేవో పాడించబోను
ఈజీవిత నిశీధినీకాంతినీటిగు
యినుపగాజులు "ఘల్లు"మనిపోయె,

స్వాప్నికలోకాల సౌఖ్యమాధురిని
చవిజూచుచున్నట్టి కవిసార్వభౌము
కఠినపాదాహతి కదలించి లేపి
మృదుపాన్పువదలి పొమ్మనినారు.
తూగుటూయల హంసతూలికాతల్ప
మందు దోబూచులనాడిపాప
యినుపహస్తాలతో నెత్తుకపోయి
పాషాణశయ్యపై పవళింపజేసె
కాంక్షించి విజయమ్ముగైకొని పోయి
రాజ్యంబునేలెడు రారాజనిపుడు
"అడవులకరుగు" మంచనినారలెవరో
అజ్ఞాతవాసిగా నంపినారెవరో.

* * * * *

### నే ను

భావరసోదయంబు మధుభారము, స్వచ్ఛము, మందపావనా
జీవనశక్తితో కదలి చేరఁగఁగోరెడు 'రమ్మ' టంచు ఆ
శావిరళంబుగా;-విధివశం బనుకూలము జేసినైన ఓ
తీవియచిన్నదాన! తమిదీరఁగఁ గ్రోలుము వేగిరంబుగా.

### వ్య క్తి

పూతమెరుంగులో పసరుపూపవయస్సున నావరించె నే
దోతమి; దానిభావము లనూహ్యము లెన్నఁడెరుంగనట్టి బా
ధాతప మీ శరీరహృదయంబుల గాల్చుచునుండుఁగాని యం
దేతరుణంబొ "సౌఖ్యమయక్లప్తము" యంచనిదోఁ చెడుఁగా సుమా!

### నే ను

పూపమొగంబులో అలసిపోయిన ఛాయలుగానవయ్యె యీ
తాపభరంబు నీయెడఁదదాకిన కారణమేమొ తెల్పదా?
పాపము! పూర్వకర్మపరిపాకఫలం బనుభూతిలోనికిం
దా పనిబూని వచ్చు నయినన్ మధురీకృతమౌను మాధురీ!

### వ్య క్తి

చేతమునం దొకప్పుడు సృజించిన కమ్మని భావరేణువుల్
రాతిరి మూర్తులై హృదయరాజ్యములో అతిలోకమూర్తితో
భాతికరంగముఁ విడిచి పాడుచు, నాడుచునుండ జేయ ప్రా
భాతముగల్గు! కర్మపరిపాకమ? సృష్టినిసర్గమా? సఖా!

## వ్యక్తి

చేతమునందు నొంటి వికసించిన కమ్మని భావసూనశో
భాతగుణంపు వాసనల పారవశత్వమునొందు గుండెపై
బాతిగ సంశయంపు విషవాయువు లాశను పెల్లగించు ఈ
చేతలు సృష్టికిన్ సహజచిహ్నములా? యెదదుర్బలత్వమా?

## నేను

పరమపవిత్రమౌ నవనవంబగు మాధ్వ్యపుజీవితంబులో
స్థిరమగు, పూర్వజన్మఫలసిద్ధమయౌ సమయాన లేహ్యాదిన్
కరము భవానురూప పరికల్పితమౌ అపురూపమూర్తి సుం
దరి! యతనంబుసేయకయె దర్శనమై హృదయంబు నైక్యమై
నిరతము స్వార్థశూన్యము ఋ నిండినప్రేమ ఘనీభవించెడున్.

ఆ మధురంపుమూర్తి హృదయంబున స్థానమునాక్రమించ ది
వ్యామల జీవితాన నుదయంబగు క్రొత్తదనంపు భావనల్
శ్యామలయామినీ సమయచారులునై మధురంపుమూర్తులై
కోమలప్రేమరంగమునగూడి నటింపఁగబిల్చు నెచ్చెలిన్.

యెదనుజనించు భావములవెప్పుడు స్వచ్ఛములౌనొ అప్పుడే
హృదయము పారవశ్యతవహించును;-సత్యము విశ్వసించనే
రదు కడు బాల్యచంచలము ప్రాయము, సంశయమీ అవిద్య, ఓ
చదువరి! విశ్వసింపుము విశాలపుసృష్టికి ప్రేమ బీజమౌ

ఏ మహనీయశక్తి కదలించెనో నీమది, దానిభావ మ
ల్లీమసృణంపు సూనములరేకుల కమ్మదనాల వాసనల్

నీమదిలోని మూర్తి కమనీయహృదంతరమంతగూడ ఓ
శ్రీమణి! తద్వశంవదుగ జేయును సృష్టిరహస్యమిద్దియే.

హృదయములలోన గుప్తమై యెరుఁగలేని
వాగతీతపు తేజోలవంబు రెంటి
నతుకు నెట్లు; నాకర్షితమౌచు; అంత
ఆత్మలందిన యనుభూతులన్ని సమము.

ఆత్మవిశ్వాసివై విశ్వమంత ప్రేమ
భరమటంచు నెరింగి త్రికరణములను
తైలధారావదచ్ఛిన్న తపముచేత
దివ్యమూర్తి లభించుక తీరగలవు.

## "శ్రావణం"

శ్రావణాంబుద మధుర గర్జారవమ్ము
లా మయూరీవిషాదలాస్యమ్మునకును
లయగ మ్రోగుచునుండె కళావిదగ్ధ
ఆమె కన్నుల బాష్పంబు లలమికొనియె!

కృష్ణవేణీతరంగిణీ గీతికాను
భావనైరాశ్య మీ శీతవాతపోత
ములు లభించుక విశ్వాసఁబోయి విధుర
హృదయములలో రహస్యాల పదిలపరచె.

* * *

*   *   *

దరవికస్వర లోచనాంతములలోనఁ
దాగియున్నట్టి ప్రణయినీరాగశక్తి
నవ్య దరహాస పరిణతానందభావ
రసము వెదజల్లు నా మనోరంగమునకు.

నవనవోన్మేషభావ ప్రణాళికలను
నాదు లేఖినినుండి మనంబులోని
మధుర కవితారసంబు నమందముగను
చిలకరించు ప్రపంచాన చిన్ననవ్వు
రచనఁజేయించుచుండు నా రాగశక్తి—

ఈ నిరీక్షణంలోన రంజించుకొనిన
సాంధ్య సుషమా మనోహరాశానురక్తి
సుకవిగీతాల నెర్రని శోభఁగూర్చి
పతితహృదయాల రక్తాన పరుఁగువెట్టు.

# కావ్యగానము

(రచన: శ్రీనివాసరావు అండ్ వి. కె. విశ్వనాథరావు)

## ఆహ్వానము

(అంకితం: "ప్రేమలేఖ" కూ, దసరాపండుగకీ)

ఈసుమప్రేమపుష్పము నోసుహృద్వ
రా! నిరంతర మెదలోన స్థానమొసఁగి
చిరిగిపోనీక, నవ్యత చెరగనీక
అవధరింపుము రసపిపాసువవుగాన.

## పూజకై

ఉ॥ చాలును, కోయఁబోకుము ప్రశాంతముగా తనత్రోవఁ బోవు నా
బేలసుమమ్ము నో హృదయహీన! ఇదే నవవాయుస్పర్శచే
తూలి యొకింతసోలెను మృదుత్వము-నీ కరపీడనంబుచే
వ్రాలునుగాదె భూస్థలి నయారె! ఇదా రసికత్వ మకటా!

ఉ॥ తీయనిసౌరభమ్ము నడతీయక లోకులకిచ్చియిచ్చి యా
ప్యాయముగా, రసాత్మహృదయాలకు శీతలసేచనంబుగా
నీయెడలేతనవ్వునగియెఁక- "ఇది యింకొక కొద్దికాలమే
సాయిగనుండుగా" యను విషాదపుసత్యము-జాలిరాదరే!

ఉ॥ చూడుము చేయి తాకి వికచోత్సుకదృశ్యము కాంక్షరేఖచే
పాడయిపోయె క్రొందనము వాడినజాడలు దోచె-నీకరం
బేడ, యొకింతచూచిన ద్రవించెడి పూవది యేడ, ఇంకనీ
వాడినదాట పాడెదది పాటయె? దేవునికైన చెల్లునే?

చ॥ ప్రిదిలిన లేతరెక్కల తపించిన లేహృదిలోని అవ్యథా
సదనమునొక్కసారి కనజాలిన మానుము-"మానవత్వమే
వదలిరికాని మాహృదయవర్ణము చూచినవారు లేర"టంచు
చదయత బల్కుచున్నది-నిషాగులు మానవులేమొ
యీాపమున్!

ఉ॥ లేతముఖంబులో తొలకరించిన ఆ చిరుకాంతిరేఖ నీ
చేతులనల్లి శుష్కకళచేత పరావృతమయ్యె-ఇట్టి లీ
లాతిశయమ్ముతో విరిసెలాస్యసుమమ్మిది-త్రుంచనేటికిన్
చేతులురావు; నీకర మచేతనమో మరియేమొ? సోదరా!

ఉ॥ కూర్చినపూవులోని నవకోమల రక్తిమగాంచలేక దై
వార్చనకై హరించితివి ప్రకృతిమాత శిరోసుమమ్ము-తాం
గార్చిన కంటినీరెటుల గారియునెట్టకపోదు నిన్ను; నీ
యర్చన గ్రుడ్డితత్వమున కాకృతి, దైవములేదె పూవులో!

## ఆవేదన

సోదరీ, చూడుమొకసారి యీాదురంత
వేదనాబాధితునిదెస- నాను లేత
యెడదలో శాంతిని హరించె; బడలి హృదయ
భారమును మోసికొనివచ్చు ప్రాణి-ఈ వి

కాలవిశ్వము మఱికిఆశయము తోడ
నా హృదయభావములఁగాంచినవ్వి వైచె
నవ్వనిమ్ము, నాభావమునాది, కాని
నవ్వనధికారమిచ్చిన దెవ్వఁడోకద??

ఇదియొకప్రకృతి-దీనిలో ముదిరినది మ
దీయభావము, అది సుప్రతిష్ఠితంబు!
దానిలోఁతోఁచినట్టి చిత్రములనెల్ల
నగ్నముగ గీసకొందు నానందగతిని.

అదియె స్వర్గము, ప్రేయసీ మృదుపదముల
లలితవిన్యాసమున కాంతులలమె నచట...
ఆ కళారచన లోకఁమునాదరించె -
కాని, నీవును లోకపుదానవెగద?

నీదయాసాంద్రహృదయ నినాదము విని
నాయెడఁద ప్రతిధ్వనించె నీనాటికేమొ?—
విశ్వమున స్నేహసహృదయ వృత్తికొఱకు,
తాపహారమైన చల్లని చూపుకొఱకు,

భావభరమైన యొకచిన్ని మాటకొఱకు,
వెదకి విసిగిన శాంతికై వేచి, వేచి
యెన్నినాళ్ళాయె-నీ లేతచిన్నినగవు
నా కనులనించె కాంతుప్రణయము, చెలియ!

# నిరాకృతి

ఈ నిరాకృతి నేను సహింపలేను—
ఈ మహోదధి నేను తరింపలేను:
మునిగిపోనిమ్ము వీచీప్రమోదమున, మ
దీయ హృదయపు కాన్క నందింతు, స్వామి!

మృదువిమజ్వాల లోలోన మీరివచ్చి
"స్మృతి" కి చిచ్చిడె-అంత విస్మృతిప్రపంచ
మచట జన్మించె, కనులకు సైకతమలమె...
మతికి కనిపించె నీ నిరాకృతియె స్వామి!

ఈ నిరాకృతి నేను సహింపలేను,
ఈ నిరస్తరాగంబు నేనిచ్ఛగించ-
తలఁపులో చేదు, మాటలో వెలితి, యెడఁద
అంతకన్నను నపవిత్రమయ్యె స్వామి!

హృదయమున నీ యపస్వరమొదియొకాని
విడిదిచేకొనె-కంపన వికృతిచెందె,
చావుబ్రదుకులనడుమ నిశ్చలతయెద్ది?
నీవయిన సరిచేయఁగారావు, స్వామి!

ఈ నిరాకృతి నేను సహింపలేను-
ఈయబోధోపహతికి నేనియ్యకొనను,
ఏ పురాకృతపాపమో యీవిధాన
కట్టికుడుపుచునుండె నకట! విధాతృ

లిఖితమున నీ నిరాకృతిలీల గోచ
రించె-ఇక నేని యుపసంహరింపు స్వామి!

ఈ నిరాకృతి నేను సహింపలేను—
ఈ యదృశ్యావృతిని నే మథించలేను:
జీవితాదర్శమే లేని జీవనంబు,
భావమే లేని బ్రదుకు, దుర్భరము స్వామి!
ఎడఁదలో నెంతకాలమీ మృదులగీతి

యణఁగువడె నీ యహంవ్యక్త వాదమునకు—
తిన్నగా యిప్పుడిది సినదించెనేమొ?
ఆగలేక ఆపఁబడక వేగి, స్వామి!

"ఈయనంతసాగరమున నీవినీత
బిందువే వృత్తమున బడి చిందిపోనో?
తెలియరాదు, ఆకృతిసుంత తెలియరాదు—
ఇది నిరాకృతి మానవహృదయమునకు"

## ౮ ప్రణయ చిహ్నము

(అంకితం Fiction కు.)

మధురమధుమాసమున నొకమావిగున్న
నొలసికలిసిన యొక లతాలలనఁ గనుచు
గూరుచొనియుంటి; భావరాగోదయంబు
చిలకరించెను అమృతంపు తొలకరింత!

తమినిశాకన్య ప్రేమజ్యోత్స్నారసంబు
బ్రోదిచేసెను తెలిమల్లెపూలతోడ,
గంధవాహుఁడు సౌగంధబంధురముగ
నృత్యమొనరించి ప్రణయవీచితతి రేపె...

ఇదియొక విషాదవేదనా సదనమనుచు
ఎలకోగాని హృదయంబు చీలిపోయె-
తన్నిశాసమయ సుప్రశాంత శ్రుతితోడ
నాలపించితి నొక్క విషాదగీతి.

ఆ నిశారాగమొగసి యాకాశవీధి
నీలిమబ్బు తెరలనెల్ల చీలఁదీసె-
దివ్యసౌందర్య జ్యోతిస్సు తేజరిల్లి
ప్రణయినీ మృదుహాసమ్ము పరిఢవిల్లె.

ముగుదకన్నుల జీవంబు పోసికొన్న
నా కనులలోన కాంతులు నాట్యమాడె...
కనులు తెరచితి; నైరాశ్యకాంతమిగిలె,
మరల ననుజూచి నవ్వె నా మానిగున్న.

## ప్రవాసగీతి

(అంకితం: మళ్ళీ పెళ్ళికి)

పతితుడై పోవుచున్నట్టి భావుకునకు,
దయకుమాలి, దుర్బలుడైన ధార్మికునకు,
నీతినిగ్రహించి మెచ్చెడి నైతికునకు,

తరచిచూచి మోహితుఁడైన తాత్త్వికునకు
కోరికోరి ప్రవసించెడి గుణయుతునకు:-

ఈ మధురస్నేహ సందేశమే ప్రపంచ
వాయువులు కొనివచ్చెనో; ఏయుదార
స్నేహదేవతా సౌజన్య స్నిగ్ధస్వర్ణ
కంఠ భాషిరమో!—కాని, కలదు ఆశ
వీడలేను నిశ్చయమిది—వీడలేను
ఆ ప్రపంచము ఆ దేవతామహస్సు
ఆ స్వరూపము ఆ భావనాసరస్సు.

## జీ వ న నౌ క

ప్రళయకాలంబునందు 'తుపాను' రేగి
మిన్నుమన్నేకమైపోవు నన్నమాట
నిజమమె, గభీరసాగరానిలతరంగ
ములు హసించెను, నాపాలి ప్రళయమువలె!

ఈ జలప్రళయమున నిటులెంతకాల
మీదగలదోయి? ఈ నాదు జీవనౌక—
లేదు తెరచాప, చుక్కాని లేదు, లేదు
లంగరేనియు యేమిచేయంగనగునో?

తలిరుటాకుల సెజ్జపై దనువుఁజేర్చి
లీల నిదురించుచున్న విలోలమూర్తి
నా మనోనాధుడతనికై ఈ మహోగ్ర
సాగరము నీదుచుంటి నిచ్ఛానురక్తి!

ప్రళయభీకరమైన ఘోషలు సెలంగ
విలయనృత్యము నా మొయిళ్ళలసికురిసె;
తీరముం జేరె, నేడు మదీయనౌక
భగ్నమైపోవ నిదియె సులగ్నమేమొ?
కడలికెరటాలలోన సాగరుమనోజ్ఞ
మూర్తికనఁబడి "రమ్ము రమ్మ"ని యటంచు
నాణిముత్యాలపేరు లుపాయనముగ
బిలుచుచున్నది నన్ను "పోయెదను సెలవు".

## మృ గీ స ఖీ!

(అంకితం: "సౌదామని" కి)

కాటుకకంటి సోయగము గాఢరసస్ఫురణార్ద్రకావ్యమో!
మాటకురానిమోహన విభావరియో, రమణీయభావమో?–
నేటికి యీ విలోలనయనేచ్ఛ రమించెను నేత్రవాణితో,
మాటలులేని యీ మధురభావనయే మనశాంతిపో!
రెపరెపలాడు "జాకెటు", పరిష్కృత కేశవిశాలలీల, ఆ
తపరమణీయమీ మృదులకాంత మనోహృతి, స్నేహపాత్రమి
విపులమృదుత్వ మీ పెదవివెన్నెల! ఓ సుమకోమలీ, యిదే
నెపమున నిన్ను నాకు కరుణించినదేమి ప్రదర్శనంబహో!
సాగరగీతమల్లదె ప్రశాంతముగా, నవమోహనమ్ముగా
రాగరసార్ద్రమై, స్ఫురితరక్తిమమై ప్రవహించుచుండె–
–నీ
యాగమనమ్ముకై తరుణమాయెను, పోదమురమ్ము ప్రేయసీ!

* * *

ఆ సోగకన్నులలో మనోహరములైన
చీకటులకాటుకలు వికసించు; ఆను
వాలుఁజూచిన తన్మయోన్మీల హృదయు
లై రసికు లార్ద్రి పారవశ్యము భజింత్రు.
ఆమె యపురూప దృక్ప్రసన్నాననమున
వలపువెలుగుల మాధుర్యతలు స్ఫురించు,
కలికి లేబెదరుచూపుల వలపుదోఁచు, —

ఆమె సాహిత్యదీపిక. ఆమెకావ్య
జీవితోపాస్యదైవము.

నీవు ఆమె

యెవ్వరో తెలియగోరెదవేని, రమ్ము:
చూడు మామెను ఈముకురోర్వియందు.

* * *

సోగకన్నులలోని
రాగిణీగీతాలు
మూగనవ్వులలోని
భోగలాలసతలు
ఊహాసేతువా ప్రేయసీ?
దాహమిత్తువా ప్రేయసీ?
నేలచూపులలోన
పాలుగారే సిగ్గు

వాలుజూపులలోన
మాటలాడేచెలిమి
విప్పిచెప్పవె ప్రేయసీ,
కప్పిపెట్టకు ఒట్టెసీ!

వలపుటూర్పులలోని
వాసనాసంపదలు
రాలుపూవ్వులలోని
కేళీవివశగతులు
ఊహించిచెప్పగలవా?
ఊకొట్టనైనగలవా?

మందయానములోని
మధురభావంబులు
సుందరాస్యముపైని
శోభావిలాసములు
తనివిదీరవు ప్రేయసీ!
తమకమెక్కెడు ప్రేయసీ!

సుప్తనేత్రములలో
గుప్తగానములేల?
నిదురపెదవులపైని
చెదరు చిరునవ్వేల?
కనులు తెరువకు ప్రేయసీ,
మనసునిలువదు నేడిసీ!

కృష్ణవేణీ! నిజము
తృష్ణకరములు సాచె...
స్వాగతంబీయగలవా?
సంతోషపెట్టగలవా?

---

## "భిక్ష"

ప్రేలాడు జాగుజడలో
బాలా! నాదృష్టిచిక్కువడ్డది; ఇది వ్యా
లోల ప్రాభవజీవిక,
లాలింతువా? స్నేహదృగాలాపమధురుచిన్.

* * *

# రక్తపిపాస

("బాల్యానికి" అంకితం)

ఒక్కమాట:- హింసకు ప్రతిహింస అవసరమేయైనచో-మానవసహానమునకు అంత్యమనునది ఉన్నచో-దైవికముగాకాక మానవనిర్మితమైన సంఘము లోపభూయిష్ఠమైనచో- ప్రకృతిసహజములైన వాంఛ సుఖాభిలాషలు లోకమున నీచార్థప్రతిపాదకములు కానిచో ఈకృతి ఆదర్శప్రాయము సమాదరణీయము.

కథాస్వరూపము:- రాధ ఒక యభాగ్యబాలిక: సంఘదౌర్జన్య
మునకు బలియైన ఒక బాలవిధవ. పిన్ననాటనుండియు అవ్యక్తముగా జీర్ణమగుచువచ్చిన తన మనోభావములకు యిప్పుడామె రంగులద్దుకొనుచున్నది- రూపము కల్పించుకొనుచున్నది. అట్టి ఈకాలములో ఆమెకు తన 'నిజ'రూపము కనిపించినది. సాంఘికముగా తన 'వ్యవస్థ' గోచరించినది. స్వభావతీవ్రమైన ఆకోమలహృదయము దీనిని తట్టుకొనలేక,

"రాధా, ఎంత యభాగ్యశాలినివె! నీ రమ్యాశయంబుల్ వృథా
బాధల్ స్వప్నగతప్రచారములు, సంభావించెదే స్నేహావాం
ఛాధర్మంబులు కానిపోని యడియాసల్, సంఘమర్యాదలే
గాధల్ద్రవ్వెడి వ్యక్తిధ్వంసణకు దుష్కాలంబు ప్రాపించుచో!

"అకటా! చిన్నతనాన నేమియెరుగంగాలేని ప్రాయాన, ముం
దుకనన్ లేని యవజ్ఞ నే ముసలిముద్దో తీర్చువేడ్కన్ వ్యథాం
తకమౌ నిట్టి వివాహముల్ సలిపి, మాతాపిత్రులే కోరి గొం
తుకకోయన్,యిక బాధ్యరాంధ్రుగను కూతుళ్లేమినోమెత్తిరో?

"అడుగని గొంతులోని తడియారని లేతయెడంద యెట్లు పై
బడెడు వయస్సుతో ముగురుభావము తాఁదెగటార్చునో కదా!
విడివడరాని భావపదవీపరివర్తన నైజమేని, యీ
వెడగుదనంపుసంఘము లవించునె? వ్యక్తిమనోనురాగముల్.

"కోరినకోర్కెచే యెడదకో తనకో లభియించుదాన సొం
పారు పవిత్రభావము నపారముగా మలినంబొనర్చి, యా
చారపు గ్రుడ్డిపాతముపచారముగా నెదఁజేయివైచి యే
తీరున నిద్రజెందెదవిసీ! సుఖమౌనె తమాలవాటికా?

"మానవధర్మమీగతి యమానుషమై చెడిపోవ, గ్రుడ్డిసం
ఘానికి సుంతమైన వెతగల్గదు, కాని స్వభావవృత్తిలో
కానికిజంకి దోదరియుఁగానక కుందు వితంతుసోదరీ
మానముదోఁచికో, తలపుమానదు—ఏమివికారసృష్టిరా?

"ఈ హృదయంబులోన వికసించిన ఎన్ని మనోజ్ఞభావముల్
ఆహుతియయ్యె నీ దురభిమానపు సంఘ శిలాముఖాగ్నిలో—
దేహములోని ప్రత్యణు విదేపనిగా నశియించునేని నే
నాహుతియౌదు నాహృదయనాదము నిండుప్రతిధ్వనింపుచున్"

అనుచు చింతించె నొక యబలాహృదయము
దీర్ఘనిద్రావివశమైన దేహిపోలె
సొమ్మసిలిపడె—పశ్చిమాశోన్ముఖముగ
గ్రుంకిపోయె నాశాసూర్య కోమలతలు.

మెల్లగా మింట నొకచుక్క మేలుకొనెను,
పుడమి నొకచుక్కపై నిద్ర పూలుజల్లె,
అచట నైజానుమోద జీవానురక్తి,
ఇచట నైజవిరుద్ధ జీవితమెముక్తి!

ఆయబల మేలుకొని ప్రకృత్యంతరముల
నొక్కపరిచూచె, శూన్యవిలోకనముల—
కాని యాచూపులోన నేదోనిబాధ
తీవ్రపరిపీడ, వేదన, తీవరించె.

తేరినచూపులో హృదయదీప్తులు మంటలుచిమ్మ, గాఢర
క్తారుణకాంతి కంటికి నిగారపు కాటుకపెట్టె—ఆమె యా

నీరవకంఠమె_త్తికొని నింగికి నేలకు నొక్క చూపుగా
నారసి "యింతియే" యన వినంగననయ్యెను, కంపితోష్ఠనై.

అదియొక విశాలవీధి—ఆపథముపైని
నడచు నొకమిత్రుఁ డొకపోవు నాగరికుని
జూచె, నొక సుందరీమణిఁజూపి "ఆమె
యెవ్వర"ను చూడ్కి కనులలో నివ్వటిల్ల.
"పచ్చిబోగపులంజె, యా పడపుగత్తె
జోలిమన కేల" యని యా విశాలహృదయుఁ
డరిగె తనయిచ్చ' నామెయు నరిగెదాటి-
కాని మిత్రుఁడు నిలువెల్ల కరిగిపోయె!
"కనుగందని కోమలహృద
యసుమము హరియించె సంఘమన్యాయముగా,
విసరె నది హాలహాలమును
అసహజవృ_త్తముల ఫలము"లని యతఁడనియెన్.

## కా మ్య ము క్తి

ప్రేయసీహృదయ సుందరశ్రీయపూర్వ
నగ్ననృత్యముకొరకు నన్నరసి పిలిచె-
స్వప్నలోకములోన యౌవనమయూర
స్వైరలీల నాపాటలో స్వరము నించె!
యెడఁదలో పొంగిపోయె ననేకమృదుల
గీతులవ్య_క్తముగ, నొక్క గీతి నేని

పాడనెంచిన తప్పు నాపయిఁనిఁదోచు!!
భావభరమైన హృదయసంపద, స్వరసుప
థానుగమనము—పాడలేనేని యెవరు
పాడగలవారు?—నేనును పాడగలను,
పాడగలను గీతాభావపదము లెల్ల:—
ఇది మొదలు మ్రోఁగఁగలదు నాహృదయవీణ.

## మాతృప్రేమ

(అంకితం: గృహలక్ష్మికి)

మగడు మరణించె; హృదయము మండిపోయె-
విస్మృతజీవిత ప్రణయపవిత్రరేఖ
హృదయదావాగ్ని కింధనసదృశమాయె!
ప్రాణపతి స్మృతికలలోని ప్రణయరాగ
పూతపవనము కీలలకూతయాయె
ఇంతయేటికి, సతిహృదయాంతరమున
ప్రజ్వలిత కీలికీల లుప్పరిగ కెగసి
రసనతడియార్చె; కన్నీటి ప్రసవమూడ్చె!

సతినొకింత యౌదార్యగాజనిన స్త్రీస
మూహములు కని పాషాణమూర్తినొందు
సతికిమారుగ; నాశ్చర్యపతనులగుచు
మునిగి కన్నులు పనిచేయఁగనుచు నిలిరి!-

అతివ మూర్ఛమునింగినదని తలఁచి,
వారు తోఁచిన శైత్యోపచారములను
సలిపి యాయమ భ్రమకు నాసలనువీడి
మడిగి—గృహముల కేగంగ మరలిరపుడు;

అనుభవతపస్విని ముదిరమణి యొకర్తు
మళ్లి, లోనికి నేగి పొత్తిళ్ళలోని
శిశువుఁగొనివచ్చి మాతృహృత్సీమనిడుచు
పలికె చెవివద్ద, "శిశువేడ్చె, నెలత! లెమ్ము."

చిత్రమననెద్ది? పాషాణి, చిత్రరూపి,
అచలప్రకృతి, చైతన్య విచలహృదయ
జీవనముదాల్చె: బాష్పసజీవదృశ్య
మెదుర వికసించె—ప్రణయసంపదలు విరిసె!

మాతృప్రణయము ప్రేమ సవితృహిమాము
మును దహించెను—నయననిర్ముక్తబాష్ప
వారి శిశుశీర్షమున జాలువార నాఁయు
మయనె, "నాహృతసర్వస్వమవు కుమార!"

## ముక్తి

వ్యభిచరించినసతి యెట్టి పరమపూత
భావహృదయయొ, తన్మృదుభావలతలు
యెట్టి యాదర్శసుమముల నీనునో యెఱుఁ
గని యొకయభాగ్యుఁడు సతినిఁగని "యభాగ్య

రాల! పొమ్ము ఆవలకు, నిన్నేలగలుగు
వానినే చూచికొమ్ము పొమ్మ"నియె, ఈస
డింపుతో—నేత్రయుగళి నిండింపఁబడిన
దృష్టి తడబాటువడ నా యదృష్టహీన
పతిహృదయ ప్రేమద్వారంబు బయలు వెడలె
తన యదృష్టరేఖను జూచికొనెడు కొఱకు!

ఆ హృదయశీల శూన్యవిశ్వావలోక
మున నయనతృష్ణ నార్పనెంచినదో యేమొ?
వెదకి, తాఁ దిరిగినలెక్క వేసరిల్లె
కాని కనఁజాలదయ్యె నిష్కామ్యగతిని.

సంఘమొకతాపుతన్నె కాంక్షావిదగ్ధ
నిగ నొనర్చెను, ఆ నవనీతహృదయ
నయిన వైదికశాంతితేజమె జ్వలించె-
ఆ సహనమూర్తి ప్రేమార్ద్రమైన హృదిని.
సహజవాంఛ, మనోలీన సహనశక్తి,
స్త్రీసహజమైన యట్టి మాతృత్వరక్తి,
ఆ సహృదయకు ఆర్ద్రజీవనమునొసఁగె
భావభరమైన చైతన్యపథమునందు.
కాలముగతించె—ఒకముద్దుబాలకామె
మాతృతవహించె: తన్మనోపూతభావ
మమలతరదుగ్ధధారల ననుగమించి
కనులబ్రవహించె యెడఁద నిష్కలుషమయ్యె!

ముడిసిపోయినకన్నుల ముద్దు, నగవు
తొలకరించిన పెదవులా చెలియహృదయ
భారమును దించివైచిన పగిదితోచె-
ఏమికావలెనింక నా ప్రేమముఖికి?

ఆలలన యంత తనముద్దుబాలవైపు
చూచె, ఆ చూపులోన ప్రస్ఫురితమైన
భావస్ఫురణకు మాటలులేవు తెల్ప—
హృదయగీతి నయనవీధి నుదితమయ్యె!!

ఆ పవిత్రదేవత కనులపుడు మూసె—
ఆ మధుర మాతృమూర్తి జీవనము బాసె.

## ఉన్మాదగీతి

(అంకితం: పి "ఫోటో"కు)

అమృతమయమైన నీ ముఖాంగణమునందు
జవ్వనీ! వెల్లివిరిసిన చంద్రకళలు
తన్మయోన్మాద సాగరాంతరమునందు
ముంచివైచెను; ఎంతసమ్మోహశక్తి?

చెమ్మగిల్లిన నయనమూలమ్ములందు
ఏమిదాచితివో కాని, నామనమ్ము
తావకీన హృదంతరాంతరము జొచ్చి
త్రావుచున్నది, తన్మధుభావరోచి!!

లోలనయన! భవత్సుధాలోకనములు
మధుమధుర భావముల నెల్ల మరుటగలిపి-
మోడువారిన ఈ చిన్ని మోకకొలకు
తత్కిరణరోచులమృతంబు దాహమొసగె!

కనుబొమలమధ్య తీర్చిదిద్దిన తిలకము
లేతముఖమున "నాజూకు" పూతబూసె,
సుందరీ! హైందవస్త్రీల యందమెల్ల
నీముఖంబునకది కరుణించెనేమొ?

చివురుపెదవులపైని నోచినమనోజ్ఞ
హాసమెంతటి మాధుర్యభాసితమ్మొ?
తన్మధురవాయువులె నన్ను దరిసినంత
మొగసిపోయితి, వినువీధి పొగలలోకి!!

## అ శ్రు త ర్ప ణ ము

(స్మృతి)

(అంకితం: "మాగంటి" ఉజ్వలాత్మకు)

ఈ విషాదతమస్సు నన్నేల యావ
రించె నీనాడు; కావ్యవిపంచి తీగె
లెడలి చెడిపోవ మూగవోయినది—నాటి
పాటలే నేడు కడసారిపాట వినిచె!

కాళరాత్రి కళేబరాకారమొందు!
పలకో కనుల జ్వాలిమేఘాలు నిండె—

వాడిపోయిన నా వ్రాతబల్లపైని
పూవొకటి నవ్వె, జీవితభావసూక్తి.

ఆకసముపై విషాదమేఘాలు, దెసల
తీవ్రపైశాచిక వ్యథాదృష్టబాధ,
ప్రకృతిలో లీనమయిన యా వ్యక్తి—యెవరు?
కావ్యరోదన జీవితకావ్యమా!...

స్తబ్ధవాయువు, శూన్యవిశ్వము విషాద
సైకతములు, కన్నీటిసంస్కారగతులు!
ఏలు కన్నీటివరదగా నేడ్చిసాగ—
బధిరుడను నేను నిశ్శబ్దభావములకు!

౨

లేఖనీ! ఒక్కసారి యాలించిపొమ్ము;
ప్రియసఖుడు అంత్యశ్వాసలో విడచినట్టి
ఆర్ద్రగీతి—నీలోలేని యంశమద్ది,
అమరలేఖనివౌదు నీకర్థమైన!

నేత్రమా! ఒక్కపరి కరుణించుమింక;
సఖుని కడసారి చూపులో సాగిపోవు
నొకవిసీల మహాజ్యోతి, యొకవిషాద
రాగరేఖ—అర్థముకాని వ్రాతనాది!

3

కలము వణకెడినేమి యోగంబుకలదొ?—
ప్రియసఖుడు మరణించిన రీతిదెలిసి

వేయికన్నుల బాష్పముల్ విడువలేక,
అనిసినిసి రెండుకన్నుల నాస్వకొంటి!

కటకటా! ఎంతయాకస్మికముగ నిన్ను
మృత్యువపహరించె, బలవంతమేమి? సఖుడ,
కాలమాట దాటలేదు యేకారణమున
నిన్ను నీయుంత దాని మన్నించినావొ?

హితము స్వార్థము చెల్లు స్నేహితులవీడి,
తిట్టిపెట్టెడి చుట్టాలపట్టు వీడి,
అవ్యయానందపథముల నరిగినావు-
మృత్యువే సత్యవచనుల మిత్రమిలను...

౪

"చిఱుతప్రాయాన జీవితచిత్రమెరిగి
యరిగినాడు అద్వైత విరాగియతడు—
యే యశోమార్గమునుద్రొక్కి యేగలేదు,
కాని యాతడు యిల కీర్తికాయుడయ్యె!

ఆశలనువీడె వీడినా డాశయములు-
బ్రదుకు కన్నీటికెరటమై వ్రాలుచున్న
నవ్వకనులతో నిలబడె నాడు; నేడు
శత్రువులగూడ సాధించి సాగిపోయె!

"జీవనమ్ము సంగీతముగా, విశాల
విశ్వము వసంతవీధిగా, ప్రియహితులె ప్ర

పంచముగ జీవితమ్ము చాలించినాడు—
మరపురాని దృశ్యములలో మనకు వెలుగు!"

## సంధ్యారాగము

సాగిపోయెడి మేఘాలవాగులోన
జలకమాడగ భానుడస్తాద్రి రేవు
కరిగె, తదరుణకిరణ రాగంబు నీట
లీనమయితోచె సాంధ్యరాగానలంబు.

తెరలు తెరలుగ నరుణిమ పొరలుకొనగ
భానుబింబ మస్తాద్రిలోపల మునింగె-
కలువకన్నెలు నవ్వువెన్నెలల గురిసె,
పద్మినీకాంత యింటిలోపలికిబోయె!

గోపబాలకు లొండొరుగూడి, యాల
పాటలవ్యక్తమధురిమఁ బాడుకొనుచు
మరలిరిండ్లకు, వారి సంబరమదేమొ?
సంజకసవూడ్చు తరుణులోసరిలి నగిరి!-

తొగరుకుంకుమ పొదరింట తొంగిచూచు
ప్రసవకన్యక పోయు పాయసమునాను
కోరికహృదంతరంబున కొనలుసాగ
మొగిలుకన్నెలు దివినుండి భువికి జాఱె.

---

# అ వ్య క్త స్వ రా లు

౧

ఈ నిశీథినీ, శాంతిస్వరానుకూల
మైనగీతి నా యెదలోన కానఁబడునో-
ఈ మలినహృదయ నీలిమ మీఁతమోవి
కారమున లీనమయి నుడికారమగునో?

౨

ఈ శరచ్చంద్రికా రసావేశసరణి
నీయెడఁద యేవిధాన నూహించుకొనునో-
ముగ్ధప్రణయినీ హృదయప్రమోదమనునో?
భగ్నప్రేమికు దుఃఖాశ్రుపాతమనునో?

3

ఈ నిరతవ్యాకుల నదీనినాదమునకు
ఏ పలుకుబడి భావనోద్దీపకంబో?-
ఈ విషాదలేఖనిచేత నెన్నఁడేని
అవిమయ మర్థసత్వాన్ని నలరునేమొ?

౪

ఈ వినీలాచ్ఛదంబు రంజించుకొన్న
ఏ తరుణముగ్ధహృదయ లీలాతిశయమొ
ఆ తటిత్కాంతి పుంజాలనందగించె-
కాని యీ నీలిమకు లేదు కాంతసంధ్య.

౫

ఈ యరుణరమ్య మందారమేయభాగ్య
రాలి చేతిలో రెక్కలురాలి పోనో?
ఇది విషాదమొ, ఆనందపదమొ తెలియ
జాలదీరాగబంధ మేలీల ద్రెంతు?

౬

ఈ మహావాయుధూతమై యీ ప్రశాంత
బిందువేకర్మమార్గాన చిందిపడునో?-
ఈయెడద గ్రహియింపగా నేరదింక
నెన్నిరాగాలు తీసిన నేమిఫలము?

---

సుప్రభాతము నేడు, సుకవి గీతము పాడె-
శుక పికాంగనలెల్ల సంతోషమున నాడె.
ఆనంద మందానిలములు నల్లన వీచె-
స్నేహ కేదారముల చెలరేగె నృత్యాలు.
భావబంధుర మనోభావముల రాపాడ
సుప్రభాతము నేడు, సుకవి గీతము పాడె.

త్వరలో :—

1. ఎందుకీ ఆకలి మంటలు ?

(ఆహార సమస్యను గురించిన కొన్ని సత్యాలు)

2. ప్రతిబింబాలు (ఖండ కావ్యం)

వివరములకు :

**HOSKER'S CLUB,**

**KHAMMAMETH.**